తా॥ దేవతలందరికి విష్ణువు కర్తయనియు ఆవిష్ణు ధర్మంబు లనఁగ దేవతలు, గోవులు, భూమిదేవతలు, దీక్షలు, ఆమ్నాయము లు, భూతదయయు, సత్యము, యజ్ఞములు, తపమును అంతరేంద్రియని గ్రహంబును, శాంతంబును, నివియన్నియు విష్ణునిదేహమని జెప్పియుండుటచే [నావిష్ణుఃపృధ్వీపతిః] యను న్యాయంబున నతని దేహసంబంధమైన ధర్మములను రక్షణ చేసికొనకున్న రాజైన వాని కి విపత్తు కలుగును. గనుక గోబ్రాహ్మణాది రక్షణంబు క్షత్రియులకు పరమ ధర్మంబై యున్నది గాక.

భార—అ—౩—అ.

క॥ నీవును నవధానముతో గోవుల మన్నింపు పాత్రకోటికొసఁగుట । తైవిత పుణ్యాచరితము । లావైరవ్రుకబోల వెన్నియైన గుమారా॥

తా॥ నీవు గోవుల నెక్కుడు శ్రద్ధతో రక్షించుటయు పాత్రతగల దానము చేయుటయు ముఖ్యము. ఆపుణ్యమునకు సరియైన పుణ్యము లెన్నియైన కావని భీష్మాచార్యుడు ధర్మరాజున కెరిగించె.

భాగ—స.

గీ॥ శుద్ధసాధులందు సురలందు శ్రుతులందు । గోవులందు విప్రకోటియందు । ధర్మపదవియందు దగిలి నాయందు వా । డెన్నడలుగునాడె హింసజెందు॥

దేవతలతో నారాయణుడనుజ్ఞ యిచ్చినట్లును॥

భాగ—ప్రథమ.

క॥ దేవతలకు ఋషులకు పితృ । దేవతలకు నాకు నీకు ధీరులకు

ను నానావర్ణాశ్రమములకును । గోవులకును బాధయనుగుచు గుండె దననగూ॥

ఇట్లు గోరూపిణియగు భూదేవితో ధర్మదేవతపలికి నట్లును.

భాగతము—అను—౦—ఆ.

గ్రంథ విస్తరణభీతిచే గోప్రభావమందు ముఖ్యతాత్పర్యము.

పూర్వంబున విశ్వకర్మతపోనియతుండై యజ్ఞార్థము తనము నోత్పత్తిచే కామరూపిణియగు సురభియను కన్యను పురుషుని సృజింపరచిన నాసురభింజూచి పురుషుండు మోహితుండై యాతని నెంమట జూచి మాత్రోభవయని యతని యాగ్రిమాన్పుటచే మాతాండుండని యతనికి నామంబిడి యాసురభిని యాతనికిచ్చిన యయ్యిరువురకు ప్రభవించిన సౌరభే యాకులంబు యానెలతకు జనించిన యపత్యంబులు యాగాపవర్గ క్షీరజనకంబులై తనలోకంబునకు పరిలోకంబున వర్తింప బ్రహ్మవరంబిచ్చి యయ్యిరువురకు ప్రభవించిన సౌరభేయాకులంబు సురాసుర ప్రముఖాఖిల జనంబులకు నమస్కారంబును సపర్యభాజనీయంబునునై రాజిల్లునని జెప్పె నమ్మార్తాండునకు యేకాదశరుద్రులు నటసౌరభేయంబగు గోకులంబు జన్మించె.

సీ॥ ఆననంబునను జిహ్వను శృంగములబలనైరి । రంధ్రంబుల మారుతుండు॥ కకుదంబునందు శ్రీకంఠుడు పదములయందు మరుద్గణమనఘ కుక్షి । వహ్నిచన్నుల సరస్వతి పెండపంచితమున లక్ష్మియును గీర్తియును గ్రమమున । రుధిరంబునందు జంద్రుడు హృదయంబున భగుడను దేవశిపాలవేధ । వెంట్రుకలయం దనుష్టానవితతి దోశధర్మదక్షుల సూర్యుండు చర్మమునద । పంబు సిద్ధితేజము సంధిపన్ల సిద్ధులునికి గలదట్టి గోవునేమనగ వచ్చు॥

యాత్రాపకరణమందే మరికొన్ని పద్యముల తాత్పర్యం.

మరిన్ని సుమిత్రుడను మునిచే పాలింపబడు గోవులుకొన్ని గోలోకధేనువులచే హవ్యకవ్యాతిథి పూజనంబులాది గాగల పుణ్య కర్మంబులకు యోగ్యంబులగు పాలు మీగడ కురియకుండుటచే గోలోకావాసులు కారని నిందింపబడి రంతిదేవుని యధ్వరోపయోగముగా శరీరంబు లర్పించి యధ్వరోపయోగార్హత గలిగి యగ్గోవులు కొన్ని భూలోకంబునకు జనినట్లును దేవతలోక కాలంబున డాగవలసి వచ్చినప్పుడు అగ్ని దేవుని గోవులు తమయందుదాచి దేవతలు కోరినప్పుడు కనుపరచుటజేసి కపిలగోవుల దానాదికంబుల కెక్కుడు ఫలంబు నిచ్చుననియు అగ్నితమయందు దాగుటజేసి కపిలత్వంబు గలిగెననియు గోవుల పేడయందు లక్ష్మీదేవి నివసించుటకు గోవుల చే వరంబు గొనెననియును.

భార-అను-౩-ఆ.

సీ॥ గోవెక్కుడు తపోభావితాత్మలకంటె ననదవిస్తారవంబునకు మేర। గలదె సత్యాఖ్యలోకంబున నవి సోమసంగతత్వంబున సంచరించు। వినుతహోమములకెల్లను బాలుపెరుగు నేయును నిచ్చు గరిశనంబునకు నొసగు। దోలు శృంగంబులు వాలంబు రోమచయము శకృన్మూత్రము లఖిలవర్త। నముల కుపచరించు శ్రమము సీతాతప। వ్యథయులేమి నెప్పుడతిభరింపు। పనులుసేయు గోబ్రాహ్మణుడ ననేకత్వంబునగుట పరమ పదముగాంచు॥

తా॥ తాపసులకంటె గోవులెక్కువ యనియు బ్రహ్మలోకమున చంద్రుని సంగతముగా చరించుననియు ఆగోవుల పాలు పెరుగు నేయి హోమములకు యోగ్యకరములనియు వాటిచర్మము, కొ

మ్ములు, లోక, క్షేమములు, మలమూత్రంబులు వఖిల కర్మంబుల కు యోగ్యంబులనియు గరిశనమునకు లోబడుననియు వర్షము, యెండ, చలి, గాలికి వ్యథపడక అతిభారమైన పనులు చేయుననియు గోవులు బ్రాహ్మణులు సమానులే ననియు.

భార—అను—౨—ఆశ్వా.

గీ॥ అనఘ గోవులు ప్రాణంబులని సమస్త। మునులు జెప్పుదు రట్లుగావున దలంప। ప్రాణదాన విధాన సంప్రాప్తమైన। ఫలము గోదాన కర్తకుగలుగు జూవే॥

తా॥ గోవులు ప్రాణతుల్యమనియు గోదానము చేయుటచే ప్రాణధానఫలము కర్తకు గలుగు ననియును.

గీ॥ రాజ ముఖ్యమగు సరస్వతి శిష్యున। కొసగ భూమిదాన మూర్జితముగ। జేసినట్టి ఫలము సిద్ధించు ధేనువు నిచ్చుటయును భూమి నిచ్చుటయును॥

క॥ గోదానఫలము సపధగ। మైదాతకునెల్ల మేలు నాపాదించుౝ। వేదప్రియ మదిమరితో। త్పాదకమగు నాతనికి విపథగతమైనౝ॥

భారతం—అ—౩—ఆ.

గీ॥ శ్రుతులు నోపనిషధ సూక్తులుగోస్వ రూ। పంబులని సరోజభవుడు జెప్పె। ధర్మపరత పరమతపము మహాధ్వర। మనగ గోన మచణనంబు దెలియు॥

గీ॥ కాలగేల గోల్లకపిల దండించిన। నరకవాసమునకు నరుగవలయు। బూరినీను లెన్నియూరసి యగ్గోవు సత్కరింప సుగతి సంభవించు॥

ర పద్యములకు ముఖ్యతాత్పర్యం.

భూమియు గోవు నొక్కటేననియు గోదానం బిచ్చిన భూదానంబిచ్చిన ఫలంబుప్రాప్తించుననియును వేదములును పనిషత్తులు గోస్వరూపమనియు అట్టిగోవును పూజించుట పరమతపము మహాధ్వరము చేయుటయనియు కాల చేత తన్నుట, కొట్టుట, అలకాపరచేశిన నరకమనియు గడ్డి నీరు లెస్సగావిచారించిన మోక్షము కలుగుననియును.

ఇట్లు చెప్పియుండుటచే సకలసుర మునిజన పూజ్యార్హతగలిగి సర్వజన పోషణీయమై వేదోప నిషత్స్వరూపమగు గోవులను రక్షించుట క్షత్రియులకు పరమధర్మముగాదా. ఇట్లుశ్రుత్యాదులు పలుకుచుండుటయు ధృతరాష్ట్ర విరాట్రాజు మొదలయినవారికి గోపరిపాలనత్వంబు గలిగినట్లు భారతాదులయందు వినియుంటిమిగదా

ఇదియుగాక.

భాగ---చతు.

క॥ మహీపతినప్పుడు గనుగొని । మహిగోరూపమున కంప్యమానయునగుచుఁ । గుహుకుండగు లుబ్ధకుగని । గహనంబున దిరుగుహరిణి కైవడిబారెఁ ॥

టీక-హరి- పృథుచక్రవర్తికి గోరూపధారియగు భూదేవికినైన సంవాదంబునందు-

సీ॥ స్వారోచిషుండన జనుమను ప్రవరుని వత్సంబుగాఁజేసి వరలు తనదు । హస్తంబుపాత్రమై యతిశయిల్లగమహి ధేనువుబితికి ధాత్రీజనులకు । సకలసస్యంబులు సర్వాయుగంబుల వృధబోకఫలియించు విధముగాగ । నొనరింపలోకు లభ్యుదయ సమేతులయి వర్ధిల్లిరతడే

ల్లి వలను గలుగు | భువనవాసులు బిలిచి వారి వికలమ్ముగ | వలయునవి
వేరువేరనీ వలనమెరయ | సిద్ధరాదోగ్ధ్రి గ్రేపులనెమ్మిజేసె | పితికిరో
న్నుదనుచు బలిమి సమ్మతమ్ము మిగుల ||

క॥ సోముడు వత్సముగా స్వా | త్రాముగురుడు దోహకుడుగా ద
గ ణఖిలచ్ఛందోమయపాత్రిక బితికిర | నామయ్యులగు మునులు బ్రహ్మ
మను దుగ్ధంబుఁ ||

క॥ సురతతిగోసిరి కాంచనవి | స్ఫారధజపాత్రమున బలరిపుని వ
త్సముగా | మరగించి సవితదోగ్ధగ | నరుదగు తేజంబుదుగ్ధమై సి
ద్ధింపఁ ||

క॥ పితృకోటి పితికెవేద | స్వతకాలురు గ్రేపుపితృకు వారును గా
రా | జితపాత్రంబున దుగ్ధం | బతులామృతమై యలర్పనవనీసురభిఁ ||

క॥ ఆయసపాత్రంబున ఘన | మాయాదుగ్ధంబుగొని రమర్త్యేతరవి
రోధుల్ | పాయకవిరోచనుడు గ్రే | పై యొక్కరుడ్ద్విమూర్ధుఁడను సు
రారిపితకగన్ ||

క॥ వసురుచి పితుకగపాత్రము | బిసరుహమ్ముగ జిత్రరథుడు పే
య్యాగగొనిరిం | పెనగంగానక్షీరం | బసమ్ముగ గంధర్వవరులు నమ
రాంగనలుఁ ||

క॥ తారపితికి కోనజాలితు | బేరునివత్సముగడించి పితికిరియక్షుల్ |
ధీమతులాయసపాత్రను | వారంతర్ధానశక్తి తగుదుగ్ధముగన్ ||

గీ॥ రజితనాథుడు దోగ్ధగా రాక్షసులు | పిశాచములు నృకపాల
భాజనములందు | గనిరి నరరుధిరాఖ్యదుగ్ధముసువాలి | వత్సమైపెం
పొనర్చగ వసుధపతిక్కి ||

క॥ వాసుకి పితికెడువాఁడుగ । భాసితఫణ పాత్రిగరళ బహులదుగ్ధ ములు । ల్లాసమున గోవుతత్తుకు । డ్రైసమకొనగానిరి దారుణాద్భుత భుజగుల్ ॥

క॥ మేరుగిరి దోగ్ధగానీ । హారినగము గోవుగానిచ్చి యాద్రులెల్ల పితికె । స్ఫారిశిలాపాత్రికలను । గోరి మహౌషధులు రత్నకోటులనూర్పన్ ॥

అన్నిటికి ముఖ్యతాత్పర్యము.

పృథుచక్రవర్తి యాజ్ఞ ప్రకారము భూదేవి గోరూపధారిణి యై మునులకు, బ్రహ్మమను దుగ్ధమును, దేవతలకు తేజమను దుగ్ధము ను, పితృదేవతలకు కవ్యమను దుగ్ధమును, రాక్షసులకు మాయాదు గ్ధంబును, గంధర్వులకు గానవిద్యాదుగ్ధంబును, పిశాచరాక్ష సులకు రక్తమను దుగ్ధమును, సర్పములకు విషదుగ్ధమును, పర్వతముల కు ఓషధులు రత్నంబులను దుగ్ధంబును, నింక నెట్టివారికట్టి దుగ్ధం బుగురిసి రక్షించినట్లును.

హరి. క॥ గోవును మహీదేవి బడసి । తీవు ప్రియసతీతిలకమ నఁగ । గావున గోవిందుఁడవను । భావంబున నామమునడగ బరగితి పేర్మిన్

తా॥ గోవు భూదేవియనియు నాభూదేవిని భార్యగా నంగీ కరించుటచే గోవిందుఁడవను నామము గలిగినదనియును ॥

భారతము — శాంతి.

భూదేవి కశ్యపుని కశ్యపునితో పరశురామునిచేఁ బాపని రా జులం జెప్పిన విషయమందు.

వ॥ అనిపలికి యుద్దళ్ళ తనస్వగత్రితంబున హైహయులకొం దరు బాపునకుఁ దప్పటయుఁ జారవాన్వయ ప్రభువుండగు విధూర

థ సుతుండు ఋక్షపర్వతంబున ఋక్షంబులచే రక్షితుండగుటయు సౌదాస వంశజనితుండగు నొకండు పరాశర సంయమివరు నధ్వర కాలంబునఁ జేసిన కారుణ్యాతిశయంబున నమ్మహాత్ముండు వానిశూద్రప్రవర్తనంబున సర్వకర్ముండనంబరగుటయు శిబిమనుమఁడు గోపతియనువాఁడు వనంబున గోవులరక్షించిన ప్రకృతికియుండె ప్రతర్దనపుత్రుండు వత్సాభిధానుండు వత్సంబుల గోష్ఠంబు రక్షణంబాచరింప సంచరించుటయును విదూరథతనయుండగు దధివాహకొడుకంగుడు అనువాఁడు గంగాకూలంబున గౌతమమునీంద్రు రక్షఁ జేసి నిర్భయుండై వర్తిల్లుటయు బృహద్రథకుల జాతుండగు భూతినామధేయుండు గృధ్రకూట శైలంబున గోలాంగూలంబుల రక్షించుటవలనం గలిగియుండుటయు మరుత్తసంతాన సంభవులు చతుర్వర్ణ వయస్కులు ముప్పురను సముద్రుండు రక్షకుండై బెనుపం దత్తీరంబున బెరుగుటయుఁ జెప్పి వారుత్తమక్షత్రియులు సమ్యక్పరిపాలనంబున నన్నరయువారుగావున ననుగ్రహించిన నచలితనైయుండెద.

క॥ వారల పెద్దలు నాకై । ఘోర పరశురాము చేత బొలిసిరి నాథా ।
వారిం ధిపతుల జేయుట । గోండగు గానన్విభు గోరితి ననఘా ॥

ఇట్లు పరశురాముచేత మరణమునకు దప్పిన క్షత్రియులుకొందరు భూపాలకత్వము విడిచియు స్వకులధర్మంబగు గోపాలనత్వంబుల గొంతకాలంబు జెంది తిరిగి భూపాల నత్వంబుకూడా పొందియున్నట్లును చెప్పియున్నది.

ఇదియునుం గాక గోవులకును భూమికిని అన్వయవ్యతిరిక్తము లేక తుల్యత్వము విహించి రాజలక్షణ ధర్మానుకూలంబై యుండుటచే క్షత్రియులకు భూపాలకమెట్లు ధర్మమో గోపాలకత్వమట్లె తెలియవలయు.

ప్రశ్న:— శ్లో॥ కృషిగోరక్ష్య వాణిజ్యం । వైశ్యం కర్మస్వభావజం ॥ భగవద్గీత- మోక్షసన్యాసయోగము. ౧౮ అధ్యాయము.

భాగ-- ఉ॥ స్తేయములేనివృత్తి యశుచిత్వము సన్నుతియున్ని జేశులర్ । మాయలులేక డాయుటయు మంత్రముజెప్పక పంచయజ్ఞముల్ । సేయుటయుల్ ధరామరుల సేవయు గోవుల రక్షణంబుప । న్యాయము లేమియుల్ మనుజనాథయెఱుంగుము శూద్రధర్మముల్ ॥

ఇంతువలన గోపాల భూపాలకత్వంబుల కభేదార్థ న్యాయమంగీకరించిన వైశ్యులను, శూద్రులను, యేలరాజులని చెప్పకూడదు

ఉ:— అట్లుచెప్పకూడ దేలననగా అగ్రజాతియగు బ్రాహ్మణులకు గలయజనాది షట్కర్మలలో ప్రతిగ్రహముతప్ప తక్కిన అయిదుకర్మల కధికారము క్షత్రియులకు కలిగియున్నప్పటికి బ్రాహ్మణులెట్లుగాలో అట్లును వైశ్యులకు క్షత్రియధర్మములు కలిగినవైశ్యులు క్షత్రియులెట్లుకాలో శూద్రులకు వైశ్యధర్మమగు పశుపాలనవలన వైశ్యులెట్లుకాలో అట్లు గోపాలనత్వంబున భూపాలక క్షత్రియనామంబన్యులకు చెల్లదు.

ప్రశ్న:— అట్లయిన వైశ్యులకును, శూద్రులకును, స్వకులధర్మంబైన గోపాలనవృత్తిచే గొల్లలని యెందుకు జెప్పకూడదు.

ఉ:— గొల్ల గోపాలయను వృత్తినామము గోపాలనంబు జేయు వారందరియందున వర్తించునని యిదివరకే చెప్పియుండబడెను గావున వైశ్యులకు, శూద్రులకు ప్రత్యేకముగా కులవృత్తి అయియున్నందున వృత్తినామంబు వారియందు వర్తించుట కేయాక్షేపణయు లేదు. ప్రతికులము వారికి విధింపబడియుండిన అనేకవృత్తులలో

సేవ్యులై యెల్లప్పుడాచరింపబడునట్టి వారలకావృత్తి నామంబులు కలిగియుండుట లోకప్రసిద్ధము.

ప్రశ్న:— బ్రహ్మక్షత్రియవైశ్యశూద్రములను చాతుర్వర్ణ్యములలో చంద్రవంశ క్షత్రియుడగు శ్రీకృష్ణుడు వరియించిన పదియాఱువేల గోపికలను ఏ జాతివారు.

ఉ:— గోపికయను శబ్దంబు వృత్తి నామంబగు గోపాలశబ్దంబునకు స్త్రీవాచకంబగును. గోప, భూప, శబ్దంబులు ఏకార్థంబ లగుటచే రాజస్త్రీలనియును కూడా చెప్పవచ్చును.

భాగ—దశ.

ఉ॥ రాజకులావతంసుడు పరాజితకంసుడు సాత్త్వికాంచితేక్షణుఁడౌ । రాజులరాజులప్పటు శరాహతినుంచి ధరాతనూజుడు । న్త్రైజిత శక్తిదోర్ని జెరదెచ్చినవారి పదాఱువేలధా । త్రీజనమాన్యలౌగుణ పతివ్రత ధన్యల రాజకన్యలన్ ॥

భాగ—దశ.

చ॥ అమితవిహారుడీశ్వరు డనంతుడు దానొకనాడు మంచిల । గ్నమున పదారువేల భవనంబులలోన పదారువేల రూ । పములు పదారువేల్ నృపబాలతి బ్రీతి పదారువేలవందముల విభూతినొందుచు యథావిధితో వరియించె భూవరా ॥

చ॥ వరవరయొక్కనాడువిను నారదసంయమి మాధవుండుదా । వరకనిర్వంచివాని భవనంబునున్న పదారువేల సుం । దరులనొక్కనాడె ప్రమదంబున నంతరకన్నిరూపులై పరిణయమయ్యె నావిని శుభస్థితి తద్విభవంబుఁ జూచెగా ॥

ఇందువలన గోపికలు రాజకన్యలనియును నిస్సంశయముగా వి భాగవతాదిపురాణములయందు స్పష్టముగా నిరూపింపబడియున్నది.

ప్రశ్న:— శ్రీకృష్ణునకు జనించిన పుత్రులసంఖ్య లెక్కించుటకు పదివేలసంవత్సరములకు దీరదనియును తద్బాలకులకు విద్యాభ్యాసములుగరుపిన గురుజనసంఖ్య మూడుకోట్ల యెనుబదెనిమిదివేల నూర్వురనియు జెప్పితిరి. అష్టభార్యలును షోడశసహస్ర గోపికలును మాత్రము కలిగినవారా శ్రీకృష్ణునకు వీరుగాక భార్యలసంఖ్యకూడా అమితము యియుండెనా అట్లుండిన ప్రమాణమేమి.

ఉ:— పైనజెప్పిన షోడశ సహస్రగోపికలు గాక ఋషిగోపికలును, మిథిలాగోపికలును, కౌసలగోపికలును, అయోధ్యాగోపికలును, పుళిందగోపికలును, శ్రీలోకాచల రమావైకుంఠ ఊర్ధ్వవైకుంఠ వాసినీ గోపికలును, దివ్యస్త్రీగోపికలును, జాలంధరీ గోపికలును, సముద్రగోపికలును, ఇట్లు పెక్కుమందిగలరు. వారల వృత్తాంతము వినుము.

శ్రీకృష్ణకథామంజరి. ఋషిగోపికల వృత్తాంతము.

వంగదేశమునందు మంగళుడను గోపవరుడుకలడు. యతనికి తొమ్మిదిలక్షల గోవులుకలవు. పెద్దలసేవించునతడు అయిదువేల గోపికల పెండ్లియాడి బహుమంది కూతుళ్ళగని పిమ్మట ఆదేశమేలురాజునకు తనకు కలహముపొసగి పశ్వాదికముల గోలుపోయి మిగుల దరిద్రుడై యుక్తవయస్కలగు కన్నెలకు వివాహము సలుపలేమి దుఃఖించుచుండి నందునియేలికయగు బృందావనమునుండి విజయుడను గోపవరుడు యీయన యింటికివచ్చి యీవృత్తాంతము దెలిసి యితనివలన నందునివృత్తాంతము దెలుసుకొని వివాహమునకై యితని వెంబడి కూతుళ్లను నందునియింటికి పంపించి నందునింట సౌఖ్యపడుచు యమునానదిగూర్చి శ్రీకృష్ణుడు తమకుభర్తగావలయునని తపంబుశేయ నాతడుప్రత్యక్షమయి వరంబిచ్చె. నందున ఆకృష్ణునకు

భార్యలయిరి. ఈగోపికలు పూర్వము రామావతారమునందు దండకారణ్యమునందు రాముని మోహించిన ఋషులు.

## మిథిలాగోపికల వృత్తాంతము.

శ్రీరామావతారమందు మిథిలానగరములో స్త్రీలు రాముని మోహించుటచే నవనందుల గృహములందు గోపికలయి జనించిరి ఆసుందరులు శ్రీకృష్ణుని భర్తగా బడయువలయునని రాధాదేవికడ కేతెంచి యామెయనుమతిని యమునాతటంబున కాత్యాయని వ్రతంబు జేయుచున్న నొక్కనా డాదేవిని పూజించుటకు వేకువను లేచి వివస్త్రలయి యమునానదిలో స్నానమాడుట దెలిసి శ్రీకృష్ణుడు చీరలెత్తుకొని పొన్నవృక్షమునందుండి వారల నమస్కారములనంది వారల గయికొని కోర్కెలీడేర్చెను.

## కోసలగోపికల వృత్తాంతము.

కోసలదేశమునందు వసియించెడి స్త్రీలు శ్రీరాముని వలచి వరమునందియున్నంతున వారు ఉపనందులనియెడి నందరాజ సహోదరు లగు తొమ్మండ్రుగుర గోపకులయిండ్లలో జనియించిరి. వీరితరగోపకుల పెండ్లియాడినను పాతివ్రత్యధర్మముచే శ్రీహరితో విహరించిరి.

## అయోధ్యా గోపికావృత్తాంతము.

సింధుదేశంబేలు విమలుడను రాజుగలఁడు యతఁడు ఆరువేల సుంది యువతుల పెండ్లియాడి సంతతిలేక వ్యసనపడుచున్న విమలుని కడకు యాజ్ఞవల్క్యుఁడు ఋషివచ్చిన తనదుఃఖంబతనితో విన్నవించిన దివ్యదృష్టిని పరికించి అసంఖ్యాకమగు పుత్రికలుద్భవింతురని చెప్పిన పుత్రులులేక గతులులేవుగదా దీనికేమి యుపాయమున శ్రీకృష్ణుండు మధురయందు వసుదేవునకు జనించు నతఁడు శ్రీనారా

యుణుంచు యాతనికి నీ కూతుళ్ళను నీరాజ్యమర్పించిన నీకీత్ర్యృణములు దీరి నీకు మోక్షము కలుగునని చెప్పిన తనకుగలిగిన కుమార్తెలను శ్రీకృష్ణునకు నిచ్చి వివాహముచేసి తాను మోక్షముబొందెను. యీ గోపికలు శ్రీరామావతారములో శ్రీరాముని మోహించి వరంబుగొనిన అయోధ్యాస్త్రీలు. వీరిని బృందావనమునకు గొనితెచ్చి మేడల యందుంచి సుఖించెను.

## సవనగోపికల వృత్తాంతము.

శ్రీరాముఁడు తనసతియగు సీత నరణ్యంబున కంపినకాలంబున తాననేక యజ్ఞంబు లాచరించినందున సతీయుతముగా జేయుట కర్తవ్యమగుటచే బంగారముచే సీతాప్రతిమచేయించి ప్రాణప్రతిష్ఠలు చేయించి కార్యంబులు గడుపుచుండుటచేత నాప్రతిమలు సజీవులయి రాముని రతిగోరిన యారాముఁ డేకపత్నీ వ్రతస్థుఁడగుటచే యనంతరము శ్రీకృష్ణావతారమున మిమ్ములవరించెదనని వరంబిచ్చుటవలన యాకన్యకలే ఉశీనరదేశమునందు కొందరి గోపాలకులకు జనించినందున వారు ద్వాదశక్షామమునకు నందరాజు చెంతకు గోవ్రజంబులతోఁ జేరి కాళిందీతీరంబున నిలయంబు లేర్పరుచుకొని వసించిరి. పిమ్మట యాకన్నియలు శ్రీకృష్ణుని తమకు వరునిగా బడయుటకు రాధాదేవి యాజ్ఞను షష్ఠాదశి వ్రతమవలంభించి శ్రీకృష్ణుని యనుగ్రహపాత్రులయ్యిరి.

## పుళింద గోపికల వృత్తాంతము.

వింధ్య పర్వతప్రాంతమునందు కొందరు పుళిందులువసించి బలసంపన్నులయి రాజులయిండ్ల ధనంబులు దోచుచుండ నాదేశపు ప్రభువు వారలతో యుద్ధముచేసి వధింప కంససహాయుఁడగు ప్రలం

బుడను రాక్షసుని సహాయముతో బాణలాప్రభువును పారదోలి కంస్థునకు భృత్యులైయుండు కామగిరియందు వసించిరి. శ్రీశ్యామళలు పంచవటియందు వసించినప్పుడు పుళిందులు రాముని వరించినకతంబున యాపుళిందులకు కన్యలై జనించి శ్రీకృష్ణుని భక్తిభావ మధనసుఖంబు లనుభవించిరి.

## శ్రీలోకాచల రమావైకుంఠ ఊర్ధ్వవైకుంఠవాసినీ గోపికల వృత్తాంతము.

నందవ్రజమునందు నీతివేధి మార్గదుడు, శుక్లుడు, పతంగుడు, దివ్యవాహనుడు, గోవిష్ణుడు, అను నార్గురు వృషభానులుగలరు వారికి పాలకడలి తీర్చునెడ లక్ష్మితోడ జనియించి యాశ్రీదేవి యేలుచుండెడి వైకుంఠమున వసియించు నారామామణి కనుంగుచెలులగు విలాసినులు ఊర్ధ్వవైకుంఠమున నుండెడి లక్ష్మిదేవి చెలికత్తియలును, సముద్రమునబుట్టి శ్రీలోకాచల వాసముచేయుచు శ్రీదేవిసఖియలును, నారాయణుని వరంబున వృషభానుల యిండ్లజనించి గోవిందునిగోరి మాఘవ్రతమాచరించు యువతులకు ప్రత్యేకమై మధనతమి దీర్చుమనిన గోపికలును.

## దివ్యస్త్రీ గోపికావృత్తాంతము.

ప్రీతిహోత్రుడు, అగ్ని, భుక్కు, సాంబుడు, శ్రీకరుడు, గోపతి, శ్రుతుడు, ప్రజేశుడు, పావనుడు, శాంతుడు, అనుప్రసిద్ధనామంబులుగల యుపనందులు, నందవ్రజంబునందు గలరు. కొసల గోపికోపఖ్యానంబునం జెప్పిన వృషోపనందులుకారు. ఆవృషనందులు బహుళమగుస్త్రీల పెండ్లియాడి పెక్కుపుత్రులును, మరికొందరు కన్యకలును జనించిరి. యాకన్యలలో కొందరు దివ్యులు, కొందరు శ్రి

గుణావృత్తులు, కొందరు భూమిగోపికలు వీరు నావిధవ్రతంబులాచరించి రాధాదేవికి చెలికత్తియలయి రాధాకృష్ణుల కేళీోత్సవముల దోడ్పడుచుందురు. ఫాల్గుణమాస మందొకనాడు వేలకొలంది కోట్లకొలంది గుంపులయి శ్రీకృష్ణుని దొడరినవారి కందరికిన్ని రూపుల తృప్తి పరచెను.

దేవజన గోపికావృత్తాంతము.

మాళవదేశంబునందు నందిదివస్పతియను గోపవరుడు స్త్రీలపెండ్లియాడి తీర్థయాత్రా గమనముజేయుచు నందరాజు మహిమలువిని బృందావనంబుసజేరి నందునిచే సన్మానింపబడి యా బృందావనము వసతిగాజేసుకొని ఘోషమేర్పరుచుకొని పుత్రమిత్రి కళత్ర బంధుయుతముగా నివశించి పూర్వము దేసలునివరంబు వరంబువడశిన దేవకన్నియ లితనికి పుత్రికలయిజనించి శ్రీకృష్ణునిగోరి యమునానది యందర్థోదయ కాలంబున దానమాడి శ్రీకృష్ణలీలలచే పరితృప్తినొందుచున్న నొకనాడు శ్రీకృష్ణుడు వరంబులొసగి వరించె.

జాలంధరీ గోపికల వృత్తాంతము.

సప్తనదీతీరమునందు రంగపత్తనమొండుగలదు. దానిద్దు రంగోజియనెడు గోపవరుడు అనేక గోపసులకు నేలికయై ధనధాన్యసమృద్ధిచేతను పుత్రమిత్ర కళత్రాదులచేతను మించి హస్తినాపురాధిపతియగు ధృతరాష్ట్రునకు సంవత్సరమునకు పదివేలనిష్కములు పన్నుకట్టుచు పరిపాలించుచు పన్నుకొంత కట్టకున్నందున రాజుచే యుద్ధముజరిగి కంససహాయుడై ధృతరాష్ట్రుని జయించి కంసునిచెంతకుజేరి మధురకుసమీపమందున్న బాహిణవడంబను పురంబునను

రాజుగారుండి యతనిభార్యలయందు పూర్వము శ్రీహరివరంబు వడ శిన జాలంధరకాంతలు గోపికలై జనించి ఇతరగోపికలను పెండ్లియాడి జారత్వంబున శ్రీకృష్ణునితోఁ కలిసి చైత్రమాసంబున భక్తిమార్గంబున రాసమునందు విహరించిరి.

సముద్రగోపికల వృత్తాంతము.

శోణపురంబున కతినాథుండగు నందుండను గోపవరుడు అయిదువేలమంది గోపికల పెండ్లియాడి అతనికి సముద్రకన్యకలును మత్స్యమూర్తివరంబు బొందినవారును అత్రివరంబున పృథ్విదోహనము జేసి హరికృపవడశిన యప్సరసలును నారాయణుని వరంబుబొందిన యప్సరసలును, వామనునివరంబు వడశిన సుతలవాసినులగు కన్యకలును, శేషునివరంబుబొందిన నాగకన్నికలును గోపికలయిజనించి దూర్వాసుని యనుగ్రహంబున యమునా పంచాంగమును కవచస్తవ సహస్రనామ పటలపద్ధతులనియెడి నైదంగములు గతులతోడనబడసి దానిచే యమునను పూజించి తద్వారంబున శ్రీకృష్ణునకు సతులుగాబడసి బృందావనంబున రాధాకృష్ణునకు డోలోత్సవంబుసల్పి హరినిమెప్పించి పతినిగాబడసిరి. ఇట్లు శ్రీకృష్ణకథామంజరియందు కలదుగావున శ్రీకృష్ణుండగణితంబగు గోపికలను వరించి లెఖ్ఖలేని సంతతిని బడసినాడని స్పష్టముగా తెలియుచున్నది.

ఆపస్తంభసూత్రము. ౧-౧-౧౧.

ప్రశ్న:— అహూర్త్రాజా మనుష్యకర్మాణా ముపాయనం । వేదార్థస్య యసమగ్ర్యాధేయం ఫలవంతిచ కర్మాణి ॥ చంద్రవంశక్షత్రియులగు యదుభోజాంధకాదులు రెండవజాతి వారైనయెడల యజనాదిషట్కర్మలలో ప్రతిగ్రహముతప్ప తక్కినకర్మలు యుపనయనాదులు జరిగి

యోచింపవలెనుగదా అట్లు నెవ్వరేని వీరలలో జరిపియున్నారా.

భాగ--వ.

ఉ:—　సీ॥ హరిరిచే సంజాతుడైన దత్తాత్రేయు సేవించి సద్యోగసిద్ధిఁ బొంది । బహుయజ్ఞ దానతపంబులు గావించి సకల దిక్కులు గల్పి జయముతోడ । సతతంబు హరినామ సంకీర్తనము జేయు ధనములఁ బొందియు దారక్షత్తి । మేనుబడిన్నైదు వేలేండ్లు భూచక్రంబు ఘనకీర్తిదనపేరుగాగ నేలె । మదిమిశేక తరుణమూర్తియై యురుకీర్తినమరేకార్త వీర్యార్జునఘ విభుడు ! నిజము వానిభంగి నేలయేలిన యట్టిరాజు నెరుగనెందు రాజముఖ్య॥

యదువంశమందు జనించిన కార్తవీర్యార్జునుం డనేకయజ్ఞదాన తపంబు లాచరించి పెద్దకాలంబు రాజ్యం బేలినట్లున్ను, మరియు నితని కుమారులలో మధువను వానికి వృష్ణుండును యితనికి నూర్వురు పుత్రులందులో నగ్రజుడు వృష్టియను వాడు గావున వాని వంశంబు వారు వృష్ణులు యాదవులనం బరగిరి.

భాగ—వ—పూ.

క॥ గాణాది భూసురోత్తమ । వగణముచే సుపేనయనము వసుదేవుడు సం । న్మాగణంబున జేయించెను । నిగణార్వ చరిత్రములకును నిజపుత్రులకున్॥

క॥ ద్విజరాజ వంశవర్యులు । ద్విజరాజముఖాంబుజోప దిష్టవ్రతులై । ద్విజరాజత్వము నొందిరి। ద్విజరాజాదిక జనంబు దీవింపంగన్॥

ఉ॥ వేదశ్రేణియు సంగకంబులు ధనుర్వేదంబు దంత్రంబు మున్నాదివ్యాహృత ధర్మశాస్త్రములు సువ్యాఖ్యాయముల్ వరకలావిద్యాదత

త్వము రాజనీతియును శబ్దప్రక్రియలఁ జెప్పె నాభూదేవాగ్రణి రామ
కృష్ణులకు సంభూత ప్రమోదంబునన్॥

వ॥ అనఘా మన మధ్యాపనము సేయుచు అన్యోన్య స్నేహ
వాత్సల్యంబులఁ జేయుకృత్యంబులు మఱవము గదా యనియు.

చంద్రవంశ శ్రేష్ఠులగు బలరామకృష్ణులకు వసుదేవుం డుపన
యనము చేయించెననియును చతుర్వేదంబులు ధనుర్వేదంబును మ
న్వాదిధర్మశాస్త్రంబులును తర్కవిద్యాదిగాఁగల సర్వవిద్యలు సాందీ
పునిచే రామకృష్ణులు నేర్చికొనిరనియును.

భా౧--ఆది--౫--౮

వ॥ ఈదేవి పతితోడన పోవ సమకట్టి పుత్రరక్షణార్థణంబు
మునిగణప్రార్థితయై యెట్టకేని మృతపాతియయ్యె నిట్టికుమారులు
గురుకుల విస్తారకులు దేవమూర్తులు యుధిష్ఠిర భీమార్జున నకుల
సహదేవులనంగా దేవాధిష్ఠిత నామంబు లందాల్చి బ్రహ్మఋషి శ్రేణి
తోపనయనులై శ్రుతాధ్యయన సంపన్నులగుచు దిరుగుచున్నవారు॥
బ్రహ్మఋషులచే పాండవులుపనయ నాధ్యయనములు నొందినట్లును.

భా౧--న.

గీ॥ వినుము దూరంబు నాడిన విసుచునుండు। మఱియు జాడము
డగ్గర నరుగుదేర। నరులలో బభ్రుకంటె. నున్నతుడు లేడు। యో
జదేవావృధునకంటె నొంధుగలడె॥

క॥ పదునాలుగు వేవురు నలు। పదివాలుగు నరులు ముక్తివడసిరి
బభ్రుండు ధుడిత్తుడు దేవావృధుడును పదపడియోగంబు దెలియబట్టికిన
కృతన్నన్॥

యాదువంశంబున జనించిన సాత్వతుని కుమారులేడుగురియుం
ను దేవావృధుడును యీయన కుమారుడు బభ్రుడను వారలు మో
క్షోపదేశార్హతగలిగి కౌశికస్వామిత్రై పదునాలుగు వేల యిరువదిన
లుపురిను విశేషాకైవల్యంబుబొంది తాము నట్టిపదవి బొందిరనియు,
వీరిమహిమ నెప్పుడు మహాపురుషులందరు శ్లోకరూపంబున పఠించు
చుందురనియు నీదేవావృధుని తమ్ముడు మహాభోజుడను వానిపేర
వంశంబు వృద్ధిబొందుటచే నావంశంబు వారు భోజులనం బరగిరి.
శ్రీకృష్ణుడును యుద్ధవాజుఁన విదురాది యనేకులకు పరబ్రహ్మోపదే
శంబు జేసినటుల భగవద్గీతాదులయందు ప్రత్యక్షసిదశఁ నీయంబై
యుంచె మఱియు.

భార--శాంతి--అ.

గీ॥ దీనినెఱిగిందునపుడు భక్తియును శమము। దమము నాశ్రయ
మును వేదతత్పరతయు । గలుగువారల కెఱింపు కాని వాని। కీకుమీ
విద్యపాత్ర దానైకనిరత॥

గీ॥ అఖిలవస్తు పూర్ణమగు వసుంధరయెల్ల। నొసగితేని యొస
గు యోగ్యతాధి। యుక్తిలేనివాని కొసగకు మీవిద్య। తగినపాత్ర
మైన తడయకిమ్ము॥

ఇట్లు భీష్మాచార్యులు ధర్మరాజునకు తత్వోపదేశం బొసం
గెననియును మఱిన్ని చంద్రవంశ క్షత్రియులగు పురూరవుండాదిగా
గల సకల భరత, కురు, యదు, వృష్టి, భోజాంధక ప్రభృతులు ప్ర
తిగ్రహంబుదప్ప యజనాదివేదోక్త కర్మంబులాచరించి రాజ్యాది
స్వకులధర్మంబులందు కొరంతలేక చిరకీర్తి గలవారయినట్లు పంచమ
వేదంబగు భారతంబు భాగవతంబు మొదలుగాగల సకల పురాణము

లున్న ప్రత్యక్ష ప్రమాణంబులై యుండగా యీచంద్రవంశ క్షత్రియులయొక్క యథార్థమును గురించి యింతగా జెప్పవలసిన నిమిత్తం కనుపడదు.

ప్ర:— పరాశరస్మృతి--౧౮ ౨ పద్యం--తృతీయాధ్యాయము.

శా॥ శౌచాచారగరిష్ఠమైన నృపజాసంబంధు లద్వింట నంకోచాబం
దకనైవసై తృకమూలక గోరం సదాయ్యగ్రజా। నూనానుల్ దినుటొప్ప
గుళ జనురుననందుం బాలో గావుచే ప్రవేచంబద్ధ పదార్థముల్
వదులకుం వేంచేసి బోసేవలేక॥ పూర్వ్యయుగమునందు గొల్లలను వృత్తినామముగల చంద్రవంశ క్షత్రియులయింట బ్రాహ్మణులు భుజియించినట్లు ప్రమాణము గలదా.

భార—అను

ఉ:— వచనములో కొంతభాగం॥ నొక యాశ్చర్యంబు జెప్పెదనా కర్ణింపుము. మాగ్యామందు మన మందిరంబునకుం వచ్చి మందహాసంబు జేయుచు గోపించుచు సుముఖుండగుచు విముఖుండగుచు కుదువ వొల్లనుచు చెక్కెంద్రకుం గావించిన కుదుపుకూరలు దానొకకందు భుజింయింపుచు సెజ్జవిద్రించుచు ధూమశయనించుచు నెందేనింబోవుచు మరలి వచ్చుచు నిట్లు వర్తించుచుండి యొక్కనాడు కృష్ణా నాకు పాయసంబులుక వేడుక బుట్టెను పెట్టింపవే యనిన తత్క్షణంబ గావించినన్ గొంతగుడిచి కొంత తనయొడల బూయుమనిన బూసితి॥ శ్రీకృష్ణునియింట మాగ్యాముందు భుజించినట్లు కృష్ణుండు ప్రద్యుమ్నునకు బోధించె.

భారతం—హరి--౬ అశ్వా.

వచనములో కొంత॥ కర్తవ్యానుష్ఠానంబులు సెల్లిన పిదప

నిట కేడంజేయుండెడి మేలిమిమీగడతోటిపెరుగుసుంగలిపిన చల్దివం
టకంబు చిక్కంబున నున్నయది మరియు శర్కరామిశ్రమంబగు పా
యసంబు వలసినంతయు దెచ్చినారము. మీకు ప్రియంబైనవిధంబు
న నారగింప వచ్చునాలరు. శ్రీకృష్ణుండు గోపాలురతోగూడి తాను
సేవ భరద్వాజులను ప్రార్థించి భుజింపబెట్టినట్లును॥

భాగ--ఆది--7--ఆశ్వా.

సీ॥ అతండు తద్భావ మరయంగమదిగోరి రూపింపనొకమరికే
పువస్తు । ననిపోయినడికేయి యధికతోజను దెంచి కేయివచ్చెదనని కే
పువచ్చు । నేప్రొద్దువచ్చిన నింతియప్పుడభక్ష్య భోజ్యముల్ ప్రొత్తుపా
ల్పుగనొనర్చు । నెయ్యెడగోరిన నిచ్చకురాబెట్టు నలయదుమదిలోన న
లుగదెపుడు । ననుదినంబుభోజు డాశ్చర్యజబిల్చిత । ద్వర్తమానముడుగ
ననజముఖరాయ । దానిగొల్చుతెరగు తాపసవర్యుచం । దమునుజెప్ప
చుండు దండిరాయలర ॥

యదువంశ సంభవుండగు కుంతిభోజునింట దూర్వాసులవా
రు భుజింపుడు భోజునికూతురియగు కుంతీదేవిచే నుపచర్యలను
బొందెననియును॥

భాగ--దశ--పూ.

సీ॥ అతిథిభూసురుడొక్కడా కారమడిగి నగజపక ప్రియముతో గార
వించి । హరిసమర్పణ మందుసన్నంబులో సగమిచ్చినభుజియించి యే
గనాక । వంతలోనొకశూద్రు డశనార్థియైవచ్చి పాడనూపలేకని
పోకతనకు । సున్నయన్నములోన నొకభాగమిచ్చిన । సంతుష్టుడైవా
డు చనిన వెనుక । కుక్కగమియు తాను నొక్కడే తేరనాయన్న శే
షమిచ్చెసన్న యమున । వానిమ్రొక్కిపంపవరుసతో చండాలుడొక్క

స్తి యనువాడు తనపేర హస్తినగరము నిర్మించెను. ఇప్పటికి ఢిల్లియను నామాంతరంబున ప్రసిద్ధిగాంచెను. నాహస్తికొడుకు కౌజమీఢుండను వానికి ముని మనుమండగు కురువు తనపేర కురుక్షేత్రము నిర్మించెను. నిప్పటికి నది యొకటి పుణ్యక్షేత్రంబనబరగు. నాకురువంశ్యులు కౌరవులనియు చెప్పబడుదురు. భరతవంశ్యులు యయాతిమహారాజు కనిష్టకుమారుడగు పూరుని వంశీయులు. భరతవంశ్యుల విశేషములు దెల్పుటచే భారతమనంబరగు. సీభరతవంశస్థులగు పాండవాదులు యాదవులతో నన్యోన్యసంబంధ బాంధవములు జేయుట ప్రశస్తముగా నెల్లరకు విశదమే. అయినను కొంత వివరించెద, శ్రీకృష్ణుని మేనత్తయగు కుంతిని పాండురాజునకును, బలరామునితోబుట్టువగు సుభద్రను నర్జునునికిని, బలరాముని కూతురగు శశిరేఖను అభిమన్యునకును, దుర్యోధనుని కూతురుని శ్రీకృష్ణుని కుమారుడగు సాంబునకును భార్యలగానిచ్చి సంబంధబాంధవములు చేసినట్లు భారతభాగవతములయందు కనుపడుచూనేయున్నది.

భాగ—పంచ.

గీ॥ యాదవులకు మీకునత్యంతకులగురు । వైనకృష్ణ డెవ్వడైనగ
లడు । కొలుచువారికెల్ల సులభుడై మోక్షంబు । నిచ్చుజింతసేయ
నేలనీకు ॥

యదువంశులకు ,మీకు అనగా భరతవంశులకు కులగురువు అనగా యీ రెండువంశములకు అధికఘనత వహించిన వాడని పరీక్షిన్మహారాజునుగూర్చి శుకులవారు పలికినట్లును ॥

భాగ—దశ—౫.

గీ॥ కూడినదువంగ గనివారితోడభజుడు । ధార్తరాష్ట్రులు మన

ఇట్లు భారత భాగవతాదులయందు యదుక్షత్రవంశ్యులకు పరస్పరబంధు ప్రమాణంబులు గలిగి యుండగాను యదు కురువంశ్యులు చంద్రవంశ క్షత్రియులై యుండగాను యయాతికుమారుల సంతతిన్నైయున్న వీరిని గురించి భేదాభేద విచారముచేయుట లెక్కవగా నైనను గ్రంథాంతరములయందక్కడక్కడ బంధు సంబంధంబు పెక్కుమారులుగ్గడింపకుండుటచే యాద్యంతంబులుగా విచారింపని వారి సందేహ నివర్తికై దెల్ప నవశ్యకమైనదిగాని భేదమేమియు లేదు॥

భాగ-౯-పూ॥

ప్రశ్న:— చ॥ అనఘయయాతిశాపమున యాదవవీరులకున్న రేశ్వరా। సనముననుండరాదు నృపసత్తమరాజపుగమ్ముభూమికి । న్నినుగొలువంగ నిర్జరులునీకరిబెట్టుదురన్యరాజుల । న్ననిగొనుచుంతరమ్ముజనపాలస శీలివిగమ్ము వేడ్కతోన॥ అను ప్రమాణంబుచే గొల్లలను వృత్తినామముగల యదువంశ క్షత్రియులకు యయాతి శాపమువలన సింహాసనాధికారార్హతలేనట్లు చెప్పియుండగా పాండవాదులకును యదువులకును భేదము నేమియు లేదనుటకు కారణమేమి॥

ఉ:— [illegible] ము నుండరాదను పదమునకు యదువంశమునకు రాజసింహాసనాధికారార్హత యేమియు లేదని యర్థము కాదు. ఆరాజు పరిపాలనచేయు రాజ్యమునకు రాజధానియగు మధురా పట్టణమందుగల సింహాసనమునకు మాత్రమే యర్హత లేనట్లు పొసంగవలయు॥

ఇందుకు దృష్టాంతములు.

భారతము-ఆది-౩-ఆశ్వా॥

వ॥ నాజరాభారంబుదాల్చిన పుత్త్రుండు రాజ్యంబునకర్హుండు

డును వంశకర్తయగుననియు శుక్రవచనంబు నిష్టదియనియు య
మాత్యప్రభృతి జనంబుల నొడంబరచి పూరుని సకల భూభార దురంధ
రుం జేసి యదుప్రభృతుల ప్రత్యంతభూములకు రాజులం జేసి తాను
తపోవనంబునకుం జనియె॥

భార-ఆది-౩ ఆశ్వా॥ (శాపవిధము.)

వ॥ అని యొడంబడకున్న యదువంశంబు వారు రాజ్యంబున
కనర్హులుగా । దుర్వసువంశంబు వారు ధర్మాధర్మవివేకశూన్యులై
సంకీర్ణకిరాత దేశంబులకు రాజులుగా ద్రుహ్యువంశంబు వారుడక
ప్లవ విరహితంబైన దేశంబునకు రాజులుగా జరాదూషకుండగుటన
నుపువంశంబువారు ముదిమియగునంతకునుండక యవ్వనంబున పం
చత్వంబు నొందువారునుగా శాపంబిచ్చి॥

భాగ-నవ॥

వచనము-౯ో కొంతె॥ పూరునియవ్వనంబిచ్చి ముదిమితానగై
కొని విగతలోభుండై నిజభుజశక్తి పాలితంబగు భూమండలంబు వి
భాగించి ద్రుహ్యునకు పూర్వభాగంబును । యదువునకు దక్షిణభా
గంబును । దుర్వసునకు పశ్చిమభాగంబును ననువునకు నుత్తరదిగ్భా
గంబును సంరక్షింపుండని యిచ్చి వారల సమక్షంబున ॥

క॥ నాలుగుచెఱగులనేలయు । బాలింపుండంచు నగ్రభవులకు
బంచెన్ । భూలోకమేలు మనుచును । బాలార్కు వాఁడబూని బ
ట్టముగట్టెన్॥

మత్స్యపురాణం-౩౪-అ॥

శ్లో॥ యఃపుత్రోగుణసంపన్నో । మాతాపిత్రోర్హితస్సహి ।
సర్వశోహాతికల్యాణంకనియానపిసప్రభుః ॥ ౨౬ ॥

గానమెందురాజముఖ్య ॥ ఇతడు యదువంశమందు జనించిన కార్త
వీర్యార్జనుండు॥

భాగవ-నవ॥

మ॥ కృశమధ్యల్ పదివేవురంగనలతో గ్రీడల్సమోదింపన । త్సు
శలుండై పదివేలులక్షలు సుపుత్రుల్భక్తిసేయన్ జతుర్దశరత్నం
డనుయోగినాబరగి సప్తద్వీప రాజేంద్రుడై శశిబిందుండురునీతిమం
తుడమరేన్ సత్కాంతి పూర్ణేందుడై ॥ ఇతడు యదువు రెండవ
కుమారుడైన క్రోష్టువు వంశమందు జనించినవాడు॥

యదువంశమునకు సింహాసనార్హతయే లేనియెడల యీ
వంశమందు జనించిన కార్తవీర్యార్జనుడు శశిబిందుడు మొదలగు
వారు భూచక్రంబంతయు వేలసంవత్సరము లెట్లేలిరి॥

భారతం । మౌసల ॥

సీ॥ నిలిపినతెరగెల్ల నృపవరజెప్పెద వినుకృత ధర్మనందనునిజూ
చి । నీతల్లియునుసవు నీతోడబుట్టినవారంను మృత్తికావరపురమున ।
నిలుడబహుసంపదలబొల్చు నప్పట్టణంబు తదీయదేశంబునిచ్చి । య
భిషిక్తుజేసిననాతండు నిజపరిజనములు దానుహార్దంబెల్లపన్ । నందు
బోయె సరస్వతి యనగబరగు । ఘననగరమున సాత్యకి తనయునట్లు ।
నెయ్యమును గారవంబును నెరయనిల్పి । యనుపముదమున నందుల
కలదుచనియే ॥

సీ॥ తక్కినవారినింద్రప్రస్థనగరంబునకుం గొనిచని వజ్రునాథుగాగ ।
నందుబట్టముగట్టి హస్తితురంగరథంబుల విభజించితిగినభంగి । న
మ్ముపురకంసమర్పితమ్ములుజేసి యన్యోబంధులనందునందు । నిలుచు
నట్లొండగనియమించియంతట యక్రూరుంభార్యల నాత్మజులను । వ

ర్జునకు నొప్పగించెనవ్యాసుఁడేల్తు । శాత్రుఁడతివినయంబునఁబల్కువరుప । వారినిబువకళవోయిరివలయు నెడకు । దానివిషయయూరకుండే భీమాను జాందు ॥

భాగ- ప్ర.

సీ॥ కలివర్తనంబున గ్రౌర్యహింసాసత్య దంభకౌటిల్యాద్యధర్మ
చయము । పురముల గృహముల భూముల దవులోన గలుగుట దల
పోశి కరిపురమున । మనుమని రాజవై మనువసదీవించి సిందుతో యక
నాభిషిక్తు జేసి । యనిరుద్ధనందనుండైనవజ్రుని దెచ్చి మధుర బట్టముగ
ట్టిమమతె బాసి । కవులతురగములను కంకణాదికముల । మంత్రిజనుల
బుధుల మానవతుల । నఖిలమైనధనమునభిమన్యుసుతునకు । నప్పగించి
బుద్ధి వాత్రేయుంచి ॥ యీపూడుపద్యములకు ముఖ్యతాత్పర్యము॥

కలియుగాదియందు కృతవర్మ కుమారునకు మృత్తికావురము రాజధానిగా నియమించి పట్టాభిషిక్తునిజేశినట్లును సరస్వతి యనుపేరుగల గొప్పపట్టణమును రాజధానిగా నియమించి సాత్యకి కుమారునకు పట్టాభిషేకముజేసి సింహాసనాధ్యక్షునిచేశినట్లును, శ్రీకృష్ణుని మనుమండగు వజ్రుని యింద్రప్రస్థ నగరంబున రాజుగా నియమించి పట్టాభిషిక్తునిజేసినట్లును, మరియును మధురకును నావజ్రుని పట్టాభిషిక్తుంజేసినట్లు జెప్పియున్నది. యీమొదలగున కారణములనుబట్టి యదువంశ క్షత్రియులకు రాజసింహాసనాధికారము కలిగయేయున్నది. ఇచ్చట యదువంశ సంభవుండగు వజ్రునకు ఇంద్రప్రస్థపురమును, మధురయును, రాజధానులుగా నియమించుటేమియని సందియంబు ప్రతిపాదించునట్లైల కేసినసన యయాతి శాపమున తత్సింహాసనాధికారము లేకపోవుటచే, అనగా మధురయందు సింహాసన

నము యయాతి మొకేగానది. వీలుగలుగక యుంగ్ర ప్రస్థపుంబు మ
థ్యారాజధానిగా నియమించి సింహాసనస్థుని జేసి తత్పూర్వ రాజధాని
యగు మధురకునుకూడా వజ్రునినధిపతిగా నియమించిరని యెరుంగ
వలయును ॥

(అనఘు యయాతి శాపమున) అనెడు పద్యమందు శాపకార
ణ సిద్ధాంతముగా తాను యదు కులమునందు జనించిన వాడనని
యు తనకు రాజ సింహాసనార్హత లేనట్లు బలికి యుగ్రసేనునికి ప
ట్టాభిషేకము జేయుటలేమనిన ఆమధుర రాజధాని యయాతి యేలిన
సింహాసనమై యుండుటనుబట్టియును తాను రాజ్యభరాపేక్ష లేని
వాడవుటవలనను పుత్రదుఃఖ నివారణార్థము రాజ్య సుఖంబులనుభ
వింపజేయుటకు నట్లుజరిగింపబడియె । నట్లుగాకున్న రాజ్యసింహా
సనార్హత లేని శ్రీకృష్ణుని ధర్మరాజొనర్చు రాజసూయ యాగమం
దు సకలరాజన్యుల మండలిలోనగ్రపూజార్హత యెట్లుగలిగినది వి
ష్ణువవుటచే నట్లుజరిగించిరనిన త్రయీధర్మనిరతులగు వారు లౌకిక
విరుద్ధంబున కెట్లంగీకరింతురు? అట్లంగీకరించిన మహావిష్ణువగు శ్రీకృ
ష్ణుండు రాజ పీఠార్హత కెందుకంగీకరింపబడదు । కావున యయా
తి శాపాభిప్రాయము పెద్దకొడుకగు యదువు వంశము వారికి రా
జ్యపరిపాలనత్వాదులు లేకపోవుటకాదు. రాజ పీఠార్హత లేదన
గా అప్పుడు మధురయందుగల సింహాసనము పూరునివంశమువారు
యెక్కవలసినదిగాని యదువంశమువారెక్కరాదని శపించినట్లు యె
రుంగవలయును- యెందుకల్లననగ ఆయయాతి యదువునకు దక్షిణ
దేశము భాగమిచ్చినట్లును తన రాజధానియందుగల సింహాసనము
పూరునికిచ్చినట్లున్నది. శాపఫలమేమనగా ! పెద్దకొమారునకు తం

ద్రి రాజపీఠాభిషేక హక్కు ధర్మశాస్త్రమైయుండగా పితృవాక్యపాలన చేయని కుమారుని అగ్రజునిగా భావింపక కనిష్ఠపుత్రుడైన పితృవాక్య పరిపాలన ధర్మంబాచరించుటచేత। అగ్రజాధికారమిర్వబకి యగ్రకుటుంబాధికారిహక్కు దప్పించి కనిష్ఠ కుటుంబమునకు గలిగించుటయే శాప ఫలంబని యెఱంగుము ॥

ప్రశ్న:— యీ చెప్పబడిన చంద్రవంశ క్షత్రియులకును సూర్యవంశ క్షత్రియులకును భేదమేమైనకలదా.

ఉ:— సూర్యవంశమునకు మూలము సూర్యుడు.

భాగ-ఆది-3అశ్వ॥

తొల్లి దాక్షాయణియైన యదితికి కశ్యపునకు బుట్టిన వివస్వంతునకు వైవస్వంతుండను మనువును యముండును శనైశ్చరుడును యమునదపతియును బుట్టిరి. అందువైవస్వతుడను మనువునందు బ్రహ్మక్షత్రియ వైశ్య శూద్రులైన మానవులుబుట్టె మరియు వానికి వేన ప్రముఖులైన రాజులేబండ్రుబుట్టి వంశంకరులై తమలో దాము యుద్ధంబులుజేసి చనిరి ॥ మరియు నమ్మనుపుత్రియైన యిలయను దానికి చంద్రని కుమారుడగు బుధునకును పురూరవుండు జనియించి చక్రవర్తియయ్యె నతనికి నూర్వసియందు నాయువు ధీమంతుడు వసువు ధృతాయువు వనాయువు శతాయువులను నార్వురు కుమారులలో నాయువునకు స్వర్భానును - నతనికి నహుషుడాదిగా పలువురు గలిగిరి. యానహుషునియందు ప్రియంవదయను దానికి యయాతి యాదిగా అయిదుగురు పుత్రులు యదువు మొదలుగాగల వారు జనించి వంశకరులైరి ॥

భారతం-ఆది-౭ఆశ్వా॥

సీ॥ ఆదిత్యునకు పుత్రియైనట్టి సావిత్రికి ననుజయుత్తమ లక్షణాను లాంగి। తపతియన్నకన్యక ధవళాయతేక్షణ యౌవనసంప్రాప్త యైన దాని। జూచి యుకదాత్యకనురుచిరగుణముల కనుగుణుండగు నిర్మలాభిజాత్యు। బతి నెవ్విధంబున బడయుదునో యని తలచుచున్నయత్తపను గూర్చి। భక్తి తపముజేసె ప్రభుడజామీఢవం। దనుడుభరతకులుడు ధర్మవిదుడు। సర్వగుణహితుండు సంవరణుండను। వాడుకృతజపోవిధానవిధుల॥

వ॥ దానం జేసి మహీతలంబున కనావృష్టియైన యొరింగి వసిష్ఠుండు శాంతికపౌష్టిక విధుల నొనర్చి, సంవరణుండు దౌర్హని హస్తిపురంబున కరిగిన సకలప్రజకు ననురాగంబయ్యె. ననావృష్టి దోషంబుబుం బాసె నంత సంవరణునకుం దపతికిం దాంపత్యుండన గురుండు బుట్టె. నది మొదలుగ మీరు దాంపత్యులైతిరని గంధర్వుండు సెప్పిన నర్జునుం డిట్లనియె॥

ఇట్లు చంద్రవంశసంభవుండగు బుధుడు వైవస్వత మనువు కూతురగు యిలయను దాని, ఆదిత్యుని కూతురగు తపతియను దానిని సంవరణుడును పరిగ్రహించుటచే॥

మనుస్మృతి॥

సవర్ణాగ్రే ద్విజాతీనాం ప్రశస్తా దారకర్మణి। కామతస్తు ప్రవృత్తానా। మిమాస్స్యుః క్రమశోవరా॥ ఇతి॥ శూద్రైవ భార్యా శూద్రస్య- సాచస్వాచవిశస్మృతే-తేచస్వాచైవ రాజ్ఞశ్చ। స్తాశ్చస్వాచాగ్రజన్మన॥

అయా యుగములయందు గోప్పవంశక్షత్రియులని తక్కువవంశీయులు పెండ్లియాడుట విధిలేనందువలన పవిత్రమయిన కులముగలవాని కొరకై సూర్యుండు ప్రయత్నించి సంవరుణునకు దపతినిచ్చుట చేత ను చంద్రవంశక్షత్రియులకన్న సూర్యవంశపు రాజులధికులయినట్లు కనుపించదు.

భాగ.

ప్రశ్న:— కం॥ బాలాయమ్ముయదుకుల ని। ర్మూలకరంబైనయట్టి ముసలంబొకటీ। బాలిక కుదయించునుబొం। డాలస్యము లేదటంచు ననిశల్యుటయుక్॥ అనుప్రవషనాణంబున మునిశాపంబున యదువంశక్షత్రియుడగు సాంబునకు ముసలంబుబుట్టి యదుకులమంతయు నిర్మూలమైనట్లు జెప్పియుండగా నీకలియుగంబున గొల్లలను వృత్తినామముగలవారు యదువంశక్షత్రియులని యెట్లుచెప్పవచ్చును

ఉ:— చంద్రవంశక్షత్రియులలో యదువృష్ణి భోజాంధకాది వంశంబులు బహుళముగా వృద్ధిబొందిగణనాతీతంబై యొప్పినట్లనగా.

భాగ—దశ—ఉ.

సీ॥ హరియిట్లు గృహమేధియగుచు శతోత్తర షోడశసహస్రసుందరులను। మునునీకు నెరుగజెప్పినరీతి, నందరకన్నిరూపములు దాన ల్చిదాల్చి। గైకొని యొక్కొక్క కామినీమణియందు రమణనమోఘవీర్యమునజేసి। పదురేసికొడుకుల బడసెరుక్మిణ్యాది పట్టమహిషుల కుద్భవులునైన। నందనులలోన ధరణినన్నంగబాహు। బలపరామవిజయ సంపద్విశేష। మానితాత్ములు పదినెనమండ్రువారి। నెరుగవినుపింతు వినుమురాజేంద్రచంద్ర॥ వ॥ అనియిట్లనువారలు ప్రద్యుమ్న, అనిరుద్ధ, దీప్తిమద్భాను, సాంబ, మిత్ర, బృహద్భాను,

మిత్రవింద, సత్య, అరుణ, పుష్కర, దేవబాహు, శ్రుతదేవ, సునంద న, చిత్రభాను, వరూథ, కవి, న్యగ్రోధులను నామంబులచే ప్రసిద్ధులైరి. వెండియు, త్రివక్రయందు సంభవించిన యుపశ్లోకుండనువాడు తనజనకుండగు కృష్ణసేవారతుండగుచు నారదయోగీంద్రునకు శిష్యుండై యఖండిత దివ్యజ్ఞాన బోధాత్ముండగుచు స్త్రీశూద్రదాసీజన సంస్కారంబై స్మరణమాత్రంబున ముక్తి సంభవించునట్టి సాత్వతతంత్రంబను వైష్ణవస్మృతిగల్పించె. నిట్లు మధుసూదననందనులు బహుప్రజలు నధికాయు రౌన్నతులు ననల్పవీర్యవంతులు బ్రహ్మణ్యులై విఖ్యాతిబొందిరి. వారిని లెక్కబెట్ట పదివేల సంవత్సరంబులకైనం దీరదు. మున్ను నీకెఱిగించినట్లు తత్కుమారులకు విద్యావిశేషంబులు నియమించు గురుజనంబులు మూడుకోట్లు నేను బదెనిమిదివేల నూర్గురు గలిగియుండు. నక్కుమారుల గణింపనెవ్వరికిని శక్యంబుగా దదియునుంగాక.

క॥ నతదేవాసురపర। గతమున మునునిహతులైన క్రవ్యాదసము। త్కరము నరేశ్వరులై। ద్వాపరమున జనియించి ప్రజల బాధలబరపగ॥

క॥ హరితద్బాధార్థమై ని। ర్జరులును యదుకులమునం జనియింపగ। ధరనూటొక్క కులంబై బరగిరి। వారినిగణింప బ్రహ్మకవశమె॥

యదువంశపుత్రియుడగు శ్రీకృష్ణునకు మాత్రము పదహారువేల గోపికలయందును నూటెనిమిది స్త్రీలకు పదురేసివంతున కొడుకులును, పట్టపుదేవులగు రుక్మిణ్యాది యెనిమిదిమందికి పదునెనిమిదిమంది బలపరాక్రమ విక్రమాది విశేషవంతులగు ప్రద్యుమ్నాది కుమారులును శ్రీ

వక్రియందు నుపశ్లోకుడనువాని గనిన్లును వారిలెక్కబెట్ట పదివేల వత్సరంబులకు దీరదనియును, తద్బాలకులకు విద్యాదులుగరపిన గురుజనసంఖ్య మూడుకోట్ల యెనుబదెనిమిదివేల నూర్గురనియును నందుచేత నగణితంబనియును, చెప్పియున్నది. యిక్కడనొక్కసందియంబు బాధించుచున్న దదేమనిన, నొక్కొకస్త్రీకి పదిమందిచొప్పున నన్నప్పుడు స్త్రీసంఖ్యనుబట్టి యొకలక్ష యరువదివేల సంఖ్యకనుపడుచుండగా నగణితమని చెప్పరాదు. ఆశ్లోకలజెప్పినసిన యొక్కొకస్త్రీకి పదుగిరికి తక్కవగాకుండా కన్యాడసియర్ధము చేయవలెను. యింతవృద్ధికికారణము దేవాసురయుద్ధమున మరణించిన రాక్షస సమూహమంతయు ద్వాపరంబున క్షత్రియవంశమునందు జనియించి జనులబాధించుటకు జేసి దేవతలు హరియును యదువంశమునందు జనియించిరనియు. నీయదువంశమందు జనియించినవారి వంశంబులు నూటొక్కకులమైనదనియు వారలగణింప వశముకాదనియు భాగవతమునందు జెప్పబడియున్నది. యీనూటొక్కకులమువారు ద్వారకయందుండిననుగదా మునిశాపమరణము తటస్థపడును. యెవరెవ రేయేదేశముల యందరెందరుండిరో తెలియదందరొక్కమాటు నశించిరని చెప్పరాదు. మునిశాపమందరిని నశింపచేయక తప్పనాయనిన కొందరు యదువంశ్యులు తప్పినట్లు భాగవతమునందు జెప్పియున్నది.

భాగ—౫—౬.

వ॥ అట్టిసమయమునందు మాధవునకు రుక్మిణీ పితృసముండును సమగ్ర భుజావిజృంభణుండును ప్రద్యుమ్నుండు జనియించె. నతనికి రుక్మిణికూతురు శుభాంగివలన ననిరుద్ధు డుదయించె నతనికి మాసలావసిష్టుడయిన వజ్రుండుసంభవించె నతనికి ప్రతిబాహుండుపు

డై. వానికి సుబాహుండు జనియించె, నతనికి నుగ్రసేనుండు ప్రభ
వించె, నాతనికి శతసేనుండుగలిగె. నిట్లు యదువృష్ణి భోజాంధక
వంశంబులు పరమపవిత్రంబులై పుండరీకాక్షు కటాక్షవీక్షణ శయ్యా
సనానుగత సరసాలాప స్నానాశన క్రీడా వినోదంబుల ననిశంబు జెం
దుచు సర్వదేవతా తీర్థంబు సమస్తంబులై పవిత్రమ్ములో నరింపుచు ప
రమానంద కందళిత చిత్తులై రని చెప్పివెండియు ॥

భాగ—ప్ర.

మ॥ యదువీరుల్ మునిశాపమున గాలాధీనులై యుద్దర్ప ।
న్మాదిరాపాన వివర్ధమానమద సమ్మర్దోగ్ర దోషాంధులై । కద
నంబుల్ దమలోనముష్టి హతులై గావించినీల్గిరి న । ష్టదర్శి జక్రి-
రి నల్గురేవురచటన్ । సర్వంసహావల్లభా ॥

సీ॥ కలివర్తనంబున క్రౌర్యహింసాసత్య దంభకౌటిల్యాద్య ధర్మచ
యము । పురములగృహముల భూములదమలోన గలుగుడదలపోసి
కరిపురమున । మనుమని రాజునై మనుమనీదీవించి సింధుతోయకణా
భి షిక్తుజేసి । యనిరుద్ధనందనుండైన వజ్రుని దెచ్చి మధురబట్టముగ
ట్టి మమతబాసి । కరులతురగములను కంకణాదికములు మంత్రిజను
ల బుధులమానవతుల । నఖిలమైనధనము లభిమన్యుసుతునకు । నప్ప
గించిబుద్ధి నాశ్రయించి ॥ ముఖ్యతాత్పర్యము.

శ్రీకృష్ణుని మనమండగు వజ్రుడనువాడు మౌసలావశిష్టుండైన
ట్లును వానిని ధర్మరాజు కలియుగాదియందు మధురకు వానిబట్ట
ముగట్టినట్లును యతనికి సుబాహుండాదిగాగల పుత్రులుజనించి వం
శంబులు వృద్ధిబొందినట్లును పూరువంశజుడగునట్టియు నర్జునిమ
నుమండగు పరిక్షిత్తును హస్తిపురంబునకు పట్టాభిషిక్తుని జేసినట్లును

ఇదియునుంగాక మునిశాపకారణమున గలిగిన యుద్ధమందు మరణంపక నలుగు రేవ్వరు జీవించరనియు జెప్పియున్నది (సప్తదశం జీవించరి నల్వురేవురుచూచో) తొమ్మండ్రుగురు నిలచిరని యర్థముజేయుటకంటె. నలుగురైదుగురు పదైదుగురుఅనుట, ఇందరుఅని యెన్నిక చేయని కొద్దిసంఖ్యనుచెప్పు లోకసాధారణ వాచకమై యున్నది. అందుచేత అపరిమిత జనసంఖ్యయందు యుద్ధమందు నిలచిన వారు బహు కొద్దియని చెప్పటమేకాని నిర్దిష్ట సంఖ్యావాచకముగాదు. గాక.

భాగ—త్ర.

క॥ శౌరియు నతిరథవరులు మ । హారథిక సమరథులు యదు
బలాదివులెల్లన్ । బోరి మృతిబొంద నుద్ధవు । డేరీతిన్ బ్రతికె దా
నినెరింగింపు తగన్॥

తా॥ శ్రీకృష్ణుడును అతిరథ, మహారథ, సమరథులు యుద్ధమందు మృతిబొందగా నుద్ధవుడు మాత్రమెట్లు బ్రతికియుండెనని శుకుల వారిని పరీక్షన్మహారాజు ప్రశ్నజేసినట్లు చెప్పియున్నది.

భాగవతం--మౌసలం.

సీ॥ పదపడియాదవ భామినీ బాలక వృద్ధజనంబు నాశుద్ధబుద్ధి ।
కలయుంగ గైకొని పలుకుల మాదణవమూర పురంబున కరుగజెప్ప ।
రామకృష్ణులు దపోరతులై ప్రవర్తించు వనభూమియారసికొని తద్ధీ
య । సందర్శనమునకు జనుటకై వారల కామంత్రితులజేసి యేమి
యనుచు । టకును శోకము మాన్చుటకును దారకుడాదినైన తగిన
వారి సమాణవచన । రచన నెరయ బనిచి యుచితత్వకతిపయ । జన్ము
లతోడరాగ జనియె నధిప॥

తా॥ అర్జునుండు ద్వారవతికేగి యదుకులానంతరమున గల స్త్రీ బాలవృద్ధ జనులను మిక్కిలి యాదరణగల మాటలచే యింద్రప్రస్థ పురంబున కరుగ నియోగించి స్త్రీ బాలవృద్ధ దుఃఖోపశమనమునకై వారలవద్ద నిల్చెననియు॥

భారతం--మౌసం.

సీ॥ కోపించి గాంధారి శాపమిచ్చినయది యాదవ సంక్షయము గుటయెట్లు। దప్పదు మనము తద్బాలవృద్ధస్త్రీ జనంబుల నెల్ల నహాకాం బులైన। కావుల సప్రతిష్ఠావిశేషంబుగా జేయంగవలయు నశాకాలము మనకు। నోదవి యత్తెరుగున కుత్సహించు టకృత్యమర్జున నీకని యాడుచుండు। బలిమరును దలంచి పాండవాగ్రజుడది। కారణముగ నతని కరుణించుఁ। నొప్పునెరుగు గాన నప్పార్థుడయ్యాదు। నికరశేష జనుల నెమ్మి నిల్పె॥

సీ॥ నిలిపిన తెరగెల్ల నృపవర జెప్పెద వినుకృతవర్మ నందనుని జూచి। నీతల్లియును నీవు నీతోడ బుట్టిన వారును మృత్తికావరపురమున। నిలుడని బహుసంపదల బొల్చునప్పట్టణంబు తదీయదేశంబు నిచ్చి। యభిషిక్తు జేసిన నాతండు నిజపరిజనములతోడ హర్షంబెలపగ। నందు బోయె సరస్వతి యనగ బరగు। ఘననగరమున సాత్యకి తనయు నట్లు। నెయ్యమును గారవంబును నెరయనిల్పి। యనుపముదమున నందులకతడు చనియె॥

సీ॥ తక్కిన వారి నింద్రప్రస్థనగరంబునకు గొనిచని వజ్రునాథు గాగ। నందు బట్టముగట్టి హాస్తితురంగ రథంబుల విభజించి తగిన భంగి। నమ్మహీపురకు సముపార్జితంబును జేసి యర్హై బంధులనందు నందు। నందును నిలుడునట్లుంగా నియమించి యకూ)రు భార్యల

వాత్మజులను । వజ్రునకు నొప్పగించిన వాసుదేవు । పౌత్రుడతి విన
యంబున బట్టువరుస । వారు నిలువక పోయిరి వలయునెడకు । దా
నివిని యారతుంజై భీమానుజుండు॥

గీ॥ వినుడు యాదవ భామినీవృద్ధ బాలజనులనందరి నుచితవర్తన
ముతోడ । ప్రొద్దువడవక ముందర బురజన ప్ర । యుతముగా బురి
వెలువరించితిగడంగి॥

గీ॥ చాపదండని యతిసోపిన భంగి గ । రాతకోటినాగి రామకృ
ష్ణ । వల్లభాదులైన వనితల గొందర। వృద్ధబాలకులను వెరవుతోడ॥

### అన్నిటికి ముఖ్య తాత్పర్యము.

పూర్వము గాంధారి కృష్ణునిపై కోపించి శాపం బిచ్చుటచేత యాదు సంక్షయంబుగాక తప్పదనియు తద్బాలవృద్ధ స్త్రీ జనంబుల నాకాలంబునకు తగిన చోటుల ముందు ప్రతిష్ఠించుటకు కర్తవ్యుడ వీవెయని ధర్మరాజు అర్జునునితో నాడుచుండె ననియు నట్లనె యిప్పుడర్జునుండు యదు నికర శేషమగు కృతవర్మనందనుని యతని తల్లిని తోడబుట్టిన వారితో సహా మృత్తికావురమునవిల్పి తత్పట్టణము తద్దేశము వారికిచ్చి పట్టాభిషేకము జేసెననియును సరస్వతి యను పేరు గల పట్టణమును సాత్యకి కుమారుని రాజుగా నియమించి తద్దేశములునొసంగి పట్టాభిషక్తు జేసెననియు దక్కిన వారిని యింద్రప్రస్థపురంబునకు దోడ్కొనిపోయి తద్దేశమునకు శ్రీకృష్ణుని పౌత్రుడగు వజ్రుని రాజుగా నియమించి తత్రాజ్యమునకు పట్టభద్రునిగా నొనరించి రథగజ తురగాదుల ముగ్గురికి సమంబుగాబంచి యిచ్చెననియు తక్కిన బంధువుల నక్కడక్కడ నుంచెననియు క్రూరుని భార్యయు పుత్రులు వజ్రుపాలనలో నుండక యిష్టవచ్చినచోట నుండిరనియు

యదుసంబంధమైన స్త్రీలను, వృద్ధులను, బాలురను గ్రామములో నుండు యితర జనులతో గూడా వుదయము గాక పూర్వము ద్వార వతి వెడలించితినని రుక్మిణ్యాది కృష్ణమహిషులతో నర్జునుడు పాడిన ట్లును రామకృష్ణవల్లభాదులైన స్త్రీలను, వృద్ధులను, బాలకులను కిరాతదండనను చిక్కుకుండునట్లు సేసి తెచ్చితినని వ్యాసులవారితో అర్జునుండాడుటయు మొదలుగాగల ప్రమాణంబులనుబట్టిగా యదువంశమునందనుకులు వంశాకరు యదుక్షయంబున దప్పిరని తెలియ వచ్చుచున్నది. (సీ॥ పదపడి యాదవభామినీ బాలక వృద్ధజనంబు) రెండవ పద్యములో రెండవ చరణము (దప్పదు మనము తద్బాలవృ ద్ధస్త్రీ జనంబులనెల్ల) గీతపద్యము ప్రథమ పాదంబున (వినుడు యా దవ భామినీ వృద్ధబాలజనుల) రెండవ గీతపద్యములో (వల్లభాదుల యిన వనితల గొందర వృద్ధబాలకులను) అని చెప్పియుండుటచే బా లురు, వృద్ధులు, స్త్రీలు నిలచిరని విస్పష్టముగా వ్రాసియుండుటను బట్టియు యాదవాదులలో ప్రముఖులైన వారే మరణించిరిగాని అనే కమంది బాలురు, వృద్ధులు, స్త్రీలు, వజ్రుడు సాత్యకి కుమారుడును కృతవర్మ కుమారుడును విదేశీయులు మొదలగు వారు చాలామంది నిలచి యుండుట దెల్పబడియె యున్నది. నూటొక్క వంశములు గా నేర్పడిన శ్రీకృష్ణసంతతి యంతయు కొందరు యదుక్షయములో ప్రముఖులయిన వారలు గలసినను పెక్కుమంది వంశాకరులై మనిర నుటకు యేయాక్షేపణయును లేదు.

చంద్రవంశవృక్షము.

1 నారాయణమూర్తి.

2 బ్రహ్మ.

3 అత్రి.
4 చంద్రుడు.
5 బుధుడు.
6 పురూరవుడు — యితను చక్రవర్తి
7 ఆయువు.
8 శ్రుతాయువు.
9 సత్యాయువు.
10 రయుడు.
11 జయుడు.
12 విజయుడు.

(7–12) నె 6 వ పురూరవుని కొమాళ్లు ఆరుగురు.

13 భీముడు — యితడు నె 12 రు కుమారుడు.
14 కాంచనుడు.
15 హోత్రుడు.
16 జహ్నువు — యితను గంగను పుక్కిట నిడినవాడు.
17 పూరుడు.
18 బాలకుడు.
19 సజకుడు.
20 కుశుడు
21 శాంబుడు.
22 ధూర్తయుడు.
23 వసువు.
24 కుశనాభుడు.

(21–24) నె 20 రు కొమరులు నలుగురు.

25 గాధి — నె 21 రు కొమారుడు.
యితడు రాజ్యపాలన చేసినవాడు

| | |
|---|---|
| 73 భార్గభూమి | వీరి వంశమువారు గార్గ్యవంశజులను వృద్ధక్షత్రవంశ జాతులన బరగిరి. |
| 74 ద్రుహ్యుడు.<br>75 యదువు.<br>76 దుర్వసుడు.<br>77 అనువు.<br>78 పూరుడు. | యీ అయిదుగురు 62 రు యయాతి కుమారులు. వీరిలో యదువంశమున బుట్టినవారు యాదవులనబరిగిరి. పూరుని వంశమువారు పౌరవులు. |
| 79 బభ్రుసేతువు. | నె 74 రు కొడుకు. |
| 80 నారబ్ధుడు. | |
| 81 గాంధారుడు. | |
| 82 ఖర్మ్ముడు. | |
| 83 ఘృతుడు. | |
| 84 దుర్మ్మదుడు. | |
| 85 ప్రచేతస్సు.<br>86<br>87 | యితనికి నూర్వ్వరు కొడుకులుపుట్టి మ్లేచ్ఛాధిపతులై యుదీచిదిశ నాశ్రయించిరి. |
| 88 వహ్ని. | నె 76 రు కుమారుడు. |
| 89 భర్గుడు. | |
| 90 భానుమంతుడు. | |
| 91 త్రిసానువు. | |
| 92 కరంధముడు. | |
| 93 మరుత్తుడు.<br>94<br>95 | యితనికి యయాతిశాపవశంబున సంతతి లేదయ్యె. |
| 96 సభానరుడు.<br>97 చక్షుస్సు.<br>98 పరోక్షుడు. | నె 77 రు అనువుకొడుకులు మువ్వరు. |

దృఢవ్రతుడు.

147 సత్యకర్మ్ముడు. ఇతనిది (111) అంగ, వంగ, వంశము.

కృత్స్నమదుడు. ఇతడు పురూరవుని మునిమనమడగు (38) సుహోత్రుని కొడుకు.

148 శునకుడు. ఇతను కృత్స్నమదుని కొడుకు.

149 శౌనకుడు. యితడు బహ్వృచ ప్రవరుండై జన్మించి తపో నియతుండై చనియె.

150 రభసుడు. యితను నె 36 రు కొడుకు.

151 గంభీరుడు.

152 కృతుడు. ఇతను బ్రహ్మకులంబున బుట్టె.

153 శుద్ధుడు. ఇతడు పురూరవునిమనుమడు నె37రు కొడుకు.

154 శుచి.

155 రజస్సు.

156 త్రికకుత్తు.

157 కృతకృత్యుడు. ఇతను విజ్ఞానియై కృతకృత్యుడై చనియెను.

158 జనమేజయుడు. ఇతను(33)రు నహుషుని మనుమడును (78)రు పూరుని కొడుకు.

159 ప్రాచీవానుడు.

160 ప్రవిరోధనమన్యుడు.

161 చారువు.

162 సుద్యువు.

163 బహుగతుడు.

164 శర్యాతి.

165 సంయాతి.

166 రౌద్రాశ్వుడు.

126 చిత్రకేతుడు. — ఇతనికి రోమపాదుడను నామాంతరము గలదు. యితను సూర్యవంశ క్షత్రియుడగు దశరథునికూతురగు శాంతను దత్తతజేసుకొని ఋష్యశృంగుడను ఋషికి వివాహము చేసెను.

127 చతురంగుడు.

128 పృథులాక్షుడు. — యితనికి బృహద్రథాది నలుగురు కొడుకులు.

129 బృహద్రథుడు.

130 బృహన్మనస్సు.

131 జయద్రథుడు.

132 విజయుడు.

133 ధృతి.

134 ధృతవ్రతుడు.

135 సత్యకర్ముడు.

136 అతిరథుడు.

137 కర్ణుడు. — ఇతడు సూర్యునకును కుంతికిని పుట్టినవాడు.

138 వృషసేనుడు. — ఇతను కర్ణునికొడుకు. మరికొందరు గలరు.

139 చంపుడు — ఇతడు పై 128 దు పృథులాక్షుని కొడుకు వీని పేర చంపానగరము నిర్మింపంబడియె.

140 హర్యంగుడు.

141 భద్రరథుడు.

142 బృహత్కర్ముడు.

143 బృహద్భానుడు.

144 జయద్రథుడు.

145 బృహత్రు —

146 విజయుడు.

దృఢవ్రతుఁడు.

147 సత్యకర్ముఁడు. ఇతనికి (111) అంగ, వంగ, [illegible]

కృత్స్నమనుఁడు. ఇతఁడు పురూరవుని మునిమనుమనకు (38) వ భ్రాతృని కొడుకు.

148 శునకుఁడు. ఇతను కృత్స్నమనుని కొడుకు.

149 శౌనకుఁడు. ఇతను బహ్వృచప్రవరుండై జన్మించి తపోనియతుండై చనియె.

150 రభసుఁడు. ఇతను నె 36 రు కొడుకు.

151 గంభీరుఁడు.

152 కృతుఁడు. ఇతను బ్రహ్మకులంబున బుట్టె.

153 శుద్ధుఁడు. ఇతఁడు పురూరవునిమనుమనుఁడు నె37వ కొడుకు.

154 శుచి.

155 రజస్సు.

156 త్రికకుప్పు.

157 కృతకృత్యుఁడు. ఇతను విజ్ఞానియై కృతకృత్యుఁడై చనియెను.

158 జనమేజయుఁడు. ఇతను (33) వ నహుషుని మనుమనుఁను (78) వ పూరుని కొడుకు.

159 ప్రాచీవానుఁడు.

160 ప్రవిరోధనమన్యుఁడు.

161 చారుపదు.

162 సుద్యుఁడు.

163 బహుగవుఁడు.

164 శర్యాతి.

165 సంయాతి.

166 రౌద్రాశ్వుఁడు.

126 చిత్రకేతుడు. — ఇతనికి రోమపాదుడను నామాంతరం బుగలదు. యితను సూర్యవంశ క్షత్రియుడగు దశరథునికూతురగు శాంతను దత్తతజేసుకొని ఋష్యశృంగుడను ఋషికి వివాహము చేసెను.

127 చతురంగుడు.

128 పృథులాక్షుడు. — యితనికి బృహద్రదాది నలుగురుకొడుకులు.

129 బృహద్రధుడు.

130 బృహన్మనస్సు.

131 జయద్రధుడు.

132 విజయుడు.

133 ధృతి.

134 ధృతవ్రతుడు.

135 సత్యకర్ముడు.

136 అతిరధుడు.

137 కర్ణుడు. — ఇతడు సూర్యునకును కుంతికిని పుట్టినవాడు.

138 వృషసేనుడు. — ఇతను కర్ణునికొడుకు. మరికొందరుగలరు.

139 చంపుడు. — ఇతడు నె 128 రు పృథులాక్షుని కొడుకు వీని పేర చంపానగరము నిర్మింపంబడియె.

140 హర్యంగుడు.

141 భద్రరధుడు.

142 బృహత్కర్ముడు.

143 బృహద్భానుడు.

144 జయదర్థుడు.

145 బృహత్కర్ముడు.

146 విజయుడు.

దృఢవ్రతుడు.

147 సత్యకర్మ్ముడు. ఇతనిది (111) అంగ, వంగ,

కృత్స్నమదుడు. ఇతడు పురూరవుని మునిమనుమడగు (88) సుహోత్రుని కొడుకు.

148 శునకుడు. ఇతను కృత్స్నమదుని కొడుకు.

149 శౌనకుడు. ఇతడు బహ్వృచ ప్రవరుండై జన్మించి తపో నియతుండై చనియె.

150 రభసుడు. ఇతను నె 36 రు కొడుకు.

151 గంభీరుడు.

152 కృతుడు. ఇతను బ్రహ్మకులంబున బుట్టె.

153 శుద్ధుడు. ఇతడు పురూరవునిమనుమడు నె37రు కొడుకు.

154 శుచి.

155 రజస్సు.

156 త్రికకుప్పు.

157 కృతకృత్యుడు. ఇతను విజ్ఞానియై కృతకృత్యుడై చనియెను.

158 జనమేజయుడు. ఇతను(33)రు నహుషుని మనుమడును (78)రు పూరుని కొడుకు.

159 ప్రాచీవానుడు.

160 ప్రవిరోధనమన్యుడు.

161 చారుపు.

162 సుద్యుప్పు.

163 బహుగతుడు.

164 శర్యాతి.

165 సంయాతి.

166 రౌద్రాశ్వుడు.

